The First Telugu Bi-Weekly in Andhra Desa. The only Telugu News Paper for
H. E. H The Nizam's Dominions

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపఁబడును

హైదరాబాదు — దక్కను

౸౩౹౯౬ GOLAKONDA PATRIKA HYDERABAD Dn.

సంపుటము ౫ } ప్రజోత్పత్తి నామ సంవత్సర చైత్ర బ॥౧౩ బుధవారము 15-4-31 { సంచిక ౬౦

## జమీందారు సంఘము

మహబూబ్ ఆబాద్

మాదిరాజు నాగభూషణరావు గారు

నేడు ప్రపంచము దినదినము నూతన గతుల అభివృద్ధికై బరువిడుచున్నవి. ఈ యభివృద్ధి వ్యక్తి పరముగను సమిష్టి పరముగను జరుగుచున్నది మానవ కల్యాణమునకై గావింపబడు నీ వివిధ యత్నములలో ప్రపంచ మనేక పరిణామములకు లోనగుచున్నవి. పూర్వ వాసనలు, పూర్వాచారములు, పూర్వాభిమానములు, అంతరించుచున్నవి. ఈ మధ్యకాలమున ప్రబలిన ప్రత్యేకాభిమానములు, న్యూనాధిక్యతా భేదములు, అధికార కాంక్ష మున్నగునవి నిప్పుచే కాగిన జలకణములు అన్యోన్యాకర్షణమునుగోల్పోయి యావిరియై రూప నాశనమును బొందినటుల విశ్వమానవ మహా సముద్రమును రూపము లేకుండ చేసివైచినవి. నేడు ప్రత్యేకత్వములు, అధికృతలు, అంతరించి సాంఘిక జీవనము సర్వ సమత్వము, మానవ సేవ అను నీ మహా మంత్రములు జపింపబడుచున్నవి.

సంఘశక్తి గుర్తింపబడుచున్నది. ఎవరికి వారు తమ అభివృద్ధికై ప్రయత్నించుట కంటె సాంఘికముగా యత్నించుట సులభమని గ్రహించిరి. వివిధ సంఘములు తమ యభివృద్ధికై యత్నించి విజయమును బొందుచున్నవి.

ఈ రాజ్యమునగల జమీందారు లన్యోన్య వైమనస్యములతో, కలహములతో, దురాచారములతో నానాటికి బలహీనులయి కృశించుచున్నారు. వివిధ సంఘములు సర్వతోముఖముగా నభివృద్ధి నొందుచుండ «బట్టిగట్టు రామలింగనివహ» జమీందారు సంఘము మాత్ర మెంతకాల మిట్లుండగలదు? కాలప్రవాహమున కెదురీదగలదు? ఈ యభిప్రాయములు కొందఱు మహాశయుల హృదయములలో మొలకలెత్తి సంప్రదింపులతో కాలము గడచిపోయెను. గత సంవత్సరము అప్పటికప్పుడు సమావేశమైన కొందఱు పెద్దలతో మ. రా. శ్రీ జన్నారెడ్డి వేంకటరెడ్డి దేశముఖుగారి యధ్యక్షతక్రింద హనుమకొండయందొక సభ జరుపబడి వరంగలు మండల జమీందారు సంఘము స్థాపింపబడెను.

«జమీందారు» అను పదమున జనసామాన్యము గ్రహించు సంపన్నులు ప్రబలులునగు భూస్వాములు మాత్రమేగాక వ్యాపకార్థమున భూమితో సంబంధముగల ప్రతిమానవుడని నిర్వచనము గావింపబడినది.

ప్రతి తాలూకాయందును తిరిగి సంఘములు నెలకొల్పవలెనని నిశ్చయింపబడెను. ఈ పనిచేయుటకై కొందఱు పెద్దలు కోరబడిరి కాని ఎట్టి కార్యమును ఎంచదగినది జరుగకున్నను కాలము మాత్ర మొకటికొకటి నిరీక్షించిక గడచిపోయెను.

నాటికి నేడుగా చ ౨౬-౩-౩౦ తారీఖు రాత్రి యీ తాలూకా ముఖ్యస్థానము అగు మహబూబు ఆబాదునందు మహారాజశ్రీ జన్నారెడ్డి వేంకటరెడ్డిగారి యధ్యక్షతక్రింద ఈ సంఘ సమావేశము జరిగి తాలూకాసంఘము స్థాపింపబడినది. ప్రస్తుతము సంఘోద్దేశముల నిర్వహించుటకు కార్యనిర్వాహక వర్గమును ఎన్నుకొనిరి.

తాలూకాయందు తిరిగి సభ్యులను చేర్చుటకు పలుకుబడిగల కొందరు మహాశయులు నిర్ణయింపబడిరి.

సంఘముయొక్క చిత్తు నిబంధనలను తయారుచేసి చ ౫ ఖుర్దాదు సన్న ౧౩౪౦ ఫ తారీఖున సమావేశమగు కార్యాలోచన సభయందు జరుపుటకు మ. రా. శ్రీ కొండపల్లి గోపాలరావుగారు (వకీలు) దయతో నంగీకరించిరి.

ఈ సంఘమునకును, ఇచ్చటగల ఆంధ్ర గ్రంథాలయమునకును తాలూకా ముఖ్యస్థానమున గృహాభావమును లేని కొఱతదీర్చుటకై మ. రా. వేంకటరెడ్డిగారు తమ స్వంత వ్యయములతో యింటిని కట్టించి యిచ్చుటకును, తత్పర్యంతము ఒకయింటిని అద్దెకుదీసికొని వారే యిచ్చుటకుగాను వాగ్దాన మొనరించి సభికుల కృతజ్ఞతా వందనములకు పాత్రులయిరి. అంతట సభ ముగింపబడెను.

ఎట్టి యాందోళనము, సంచలనము, అభివృద్ధి లేకయున్న నిజాం రాష్ట్ర ప్రజా సముదాయమున నూతనోత్తేజము గలుగుచున్నదనియును మ. రా. జన్నారెడ్డి వేంకటరెడ్డిగారివంటివారుకూడ విశాలభావ ప్రేరితులై ప్రజాహితైక తత్పరులగుచున్నారనియును తెల్పుటకు సంతసమగుచున్నది. ఈసంఘము రాష్ట్రమునకును ప్రజలకును సేవజేసి మానవ కల్యాణమునకై యత్నించు సంస్థలలో నొకటియై చెందిన వృద్ధినందునట్లు అనుగ్రహించుగాకయని యీశ్వరుని ప్రార్థించుచున్నాను.

---

## సత్తెనపల్లి

(స్వకీయ విలేఖరి)

### జాతీయ వారము

సత్తెనపల్లి ఏప్రెల్ ౯ — జాతీయవార ప్రారంభమగు ఏప్రిల్ ౬ వ తేదీనాడు ఉదయము మోతీలాల్ చౌకునుండి నగర సంకీర్తనము పట్టణము నందంతటను జయజయ ధ్వానములతోడను జాతీయ పతాకముల తోడను తిరిగి సుమారు ౧౧ గంటలకు చౌకికి చేరిరి. అచట శ్రీయుత సామలకంటి మృత్యుంజయ రావుగారు జాతీయ పతాకమును స్థాపించిరి.

### బహిరంగ సభ

నాటి సాయంత్రము శ్రీయుత డాక్టరు భృగుబండ మృత్యుంజయ రావుగారి అధ్యక్షతను బహిరంగ సభ యొకటి జరుపబడెను స్త్రీ పురుషులు అన్ని మతముల వారు సభను అలంకరించిరి. సభయందు శ్రీయుతులు బొడ్డపాటి సుబ్బారావు సామలకంటి మృత్యుంజయరావు, కొండముది రామకృష్ణరావు వావిలాల వేంకటరామ శర్మ, వావిలాల గోపాలకృష్ణయ్యగార్లు జాతీయవాదమును గురించి ప్రసంగించిరి. అధ్యక్షుల అంత్యోపన్యాసముతో సభ ముగింపబడెను.

### ఖద్దరు అమ్మకము

ఈ జాతీయవారమున కాంగ్రెసువారు ఏర్పరచిన విధముగ ఖద్దరు అమ్మకము జరుగుచున్నది, ఒక ముఠా సత్తెనపల్లిలోను ప్రచార మొనర్చుచున్నది. శ్రీయుతులు బొడ్డపాటి సుబ్బారావు సామలకంటి మృత్యుంజయ రావుగార్లు గల యొక ముఠా పెదకూరపాడు తదితర పరిసర గ్రామముల తోను అమ్ముచున్నారు అమ్మకములు కొలది అభివృద్ధి కరముగ నున్నవి.

### రాజకీయ ఖైదీల అస్వస్థత

కొంత పుట్ట జేయిలునుండి విడుదల ఆయివచ్చిన శ్రీయుత వావిలాల వేంకటరామ శర్మగారు యిచటికి వచ్చి మలేరియా వ్యాధిచే పీడింపబడు చున్నారు కొంత స్వస్థత గలుగుటచే నాడుపవ్యసింప గలిగిరి. వీరి కిచటజ్వరము తగుల లేదుగాని యిచటికి వచ్చిన వెంటనే ప్రారంభమాయెను.

---

REG NO N 45

Reg. No. M. 2185


గోలకొండపత్రిక
సుల్తాను బజారు హైదరాబాదు దక్కన్.

సంవత్సరము చందా

| | |
|---|---|
| | రు. ౭—౦ ౦ |
| అర్ధ ,, | ౩ -౮—౦ |
| విడి పత్రిక | ౦—౦—౪ |

Printed and published by G. Ramakrishna Reddy at the Golakonda Powr Press, Hyderabad. Editor K. Balakrishna Reddy